# ధ్రువుడు

రచయిత

డి. నాగసిద్ధారెడ్డి

ప్రధానసంపాదకుడు

డాక్టర్ ఎస్. బి. రఘునాథాచార్య




ప్రచురణ .

శ్రీ పి. వి. ఆర్ కె. ప్రసాద్, ఐ. ఏ. ఎస్.

కార్యనిర్వహణాధికారి,

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

1980

T.T.D. Religious Publications Series No. 57

SRINIVĀSA BĀLABHĀRATI - 4
(Children Series)

# DHRUVUDU

by
D. Nagasiddha Reddy

Chief - Editor :
Dr. S. B. Raghunadhacharya

Krishna Pushkaram
Roudri, 1980
Copies 10,000.

*Published by* :
Sri P. V. R. K. Prasad, I.A.S.,
Executive Officer,
Tirumala Tirupati Devasthanams,
Tirupati.

ART : SEELA VIRRAJU

Subsidised Price : 0—50

*Printed at :*
Tirumala Tirupati Devasthanams Press, Tirupati.

# స్వాగతం !!

శ్రీనివాసదయోద్భూతా బాలానాం స్ఫూర్తిదాయినీ ।
భారతీ జయతాల్లోకే భారతీయగుణోజ్జ్వలా ॥

ఖండ ఖండాంతరాల్లో నాగరికత కన్నువిప్పేనాటికే సభ్యతకు సంస్కారానికి, నైతిక-ధార్మికాదర్శాలకు పేరుపడ్డది మన భరతఖండం. ఈ గడ్డపై పుట్టిన ప్రతిమానవుడు అధర్మాన్ని ఎదిరిస్తూ, ధర్మాచరణంలో తన జీవితాన్ని పండించుకొని, మాధవాభిముఖంగా నడచి మహనీయకీర్తి నార్జించినవాడె. అలాంటి మహాత్ముల సన్నిధి మన సుఖ సంతోషాలకు పెన్నిధి. కనీసం వారి జీవితాదర్శాలు మనస్సుల్లో మెదిలితే వాటిప్రభావం మనమీద ఎంతో ఉంటుంది. 'నేను భారతీయుణ్ణి' ఇది తర తరాలనుంచి వస్తున్న నా సంప్రదాయం', 'ఇది నాకర్తవ్యం' అని ప్రతి బాలుడు, బాలిక, ఈదేశసేవకు తనను అంకితం చేసుకుంటారు.

నిజానికి ఈదేశంలో ఎందరో మహానుభావులు, మహాపురుషులు, మహాపతివ్రతలు, మహావీరులు పుట్టి, పెరిగి, చక్కని సంస్కృతికి పునాదులు వేశారు. స్వచ్ఛమైన జీవనవాహినిని మనదాకా ప్రవహింపచేశారు. ఆహా! మనమెంత అదృష్టవంతులం! మన వెనుక ఎంత ఉదాత్తమైన చరిత్ర ఉంది! ఆ పుణ్యపురుషులు, మహాసాధ్వులు, ఇక్కడ పుట్టకపోతే మనదిగా మనం చెప్పుకొనే మహత్తరమైన ఈ సంస్కృతి, సభ్యత మనకెలా సంక్రమించేవి? వాళ్లను అర్థం చేసుకోవడం, వాళ్ల చరిత్ర మననం చేసుకోవడం, వారి ఆదర్శాలు స్మరించడం కూడ మనకు గొప్ప విజ్ఞానాన్నందించే విద్యాభ్యాసం. అది ముందు ముందు మనజాతి జీవనప్రవాహంలో కొన్ని ఏండ్లదాకా చెక్కుచెదరని స్ఫూర్తిసౌరభాలను విరజిమ్ముతుంది. అందుకే శ్రీనివాసబాలభారతి ఉదయించింది. ఎందరో మహానుభావుల్ని మీముందుంచుతోంది. ఇక మీదే ఆలస్యం. బాలలూ! రండి! రండి!

నిండుమనస్సుతో మీకిదే మాస్వాగతం!

వరలక్ష్మీవ్రతం
22-8-1980
ధ్రువుడు 2

ఎస్. బి. రఘునాథాచార్య
ప్రధానసంపాదకుడు

అయిదు సంవత్సరాల పిల్లలెక్కడైనా ఆడుకుంటా మంటాడు గాని తపస్సు చేస్తామంటారా? అదీ భయంకర క్రూరమృగాలు నివసించే అరణ్యంమధ్యలో. సామాన్యంగా ఎవ్వరూ అనరు. కానీ మన చరిత్రలో ధ్రువతారగా నిలిచిపోయిన ఒక మహానుభావుడు రాజకుమారుడై కూడా అలా పట్టుదలతో తపస్సు చేస్తానన్నాడు. అనడంమాత్రం కాదు. ఎంతమంది నిరుత్సాహపరచినా తన నిర్ణయం మార్చుకోకుండా అరణ్యాల్లోకి వెళ్లి ఉగ్రతపస్సుచేశాడు. శ్రీమహావిష్ణువును ప్రత్యక్షం చేసుకొని అనుకున్న శాశ్వతస్థానాన్ని సాధించేదాకా పట్టువదల్లేదు. అచంచలమైన దీక్షకు అతడు మారుపేరు. అతడి పేరు ధ్రువుడు.

— ప్రధానసంపాదకుడు

# ధ్రువుడు

అది చిన్నకార్యమైనా పెద్దకార్యమైనా సాధించాలంటే పట్టుదల కావాలి. పట్టుదల, ప్రయత్నంలేని మనిషి ప్రముఖుడు కావడం అసాధ్యం. చీకటిరాత్రుల్లో ఉత్తరదిక్కున ఆకాశంవైపు చూస్తే మిల మిల మెరిసే చుక్కల్లో ఒక నక్షత్రం మరీ ప్రకాశమానంగా వెలుగుతూ మనకు కనబడుతుంది. అదే ధ్రువనక్షత్రం. ఆ ధ్రువుడెవరో తెలుసా ?

జననం :

చాలకాలం క్రిందట ఉత్తానపాదుడనే మహారాజొకడుండేవాడు. అతనికి ఇద్దరు భార్యలు. పెద్దభార్యపేరు సునీతి. చిన్నభార్యపేరు, సురుచి. పేరుకు తగ్గట్టు సునీతి సన్మార్గురాలు. సురుచి అందగత్తె అహంకారి. సునీతికి ధ్రువుడనే కుమారుడు, సురుచికి ఉత్తముడనే కొడుకూ వున్నారు. ఉత్తమునికంటె ధ్రువుడే వయస్సులో కొంచెం పెద్ద. అన్నదమ్ములిద్దరూ ఎంతో అన్యోన్యంగా వుండేవారు. వారిమధ్య ఎలాంటి దెబ్బలాటలూ వుండేవి కావు.

సురుచి-సునీతి :

ఒక భార్యవుండగా మరొకతెను పెళ్ళాడారంటే మొదటిభార్య మీద అంతప్రేమ వుండదనీ, అందువల్లే మరోవివాహం చేసుకొన్నాడనీ లోకమనుకోవడం సహజం. రాజుకు సునీతిమీద ప్రేమ తక్కువ.

సురుచిమీద మక్కువ ఎక్కువ. సురుచి అసాధ్యురాలు. ఆమె తన మాటలచేత, చేష్టలచేత భర్తను లొంగతీసుకొని సునీతిమీద ఉత్తాన పాదునికేమాత్రం అభిమానంలేకుండా చేసింది. సురుచి మాయలో పడిన రాజు పెద్దభార్యను దాసికంటే కూడ నీచంగా చూచేవాడు. ఆవిధంగానే అతనికి పెద్దకుమారుడైన ధ్రువుని మీద సైతం వాత్సల్యం తగ్గిపోయింది. సురుచి కైకలాంటి మనిషి. రాజ్యం ధ్రువుడికి దక్క కుండా ఎలాగైనా తనకొడుక్కే సంక్రమించాలని ఆమె కోరిక. అందు వల్ల ధ్రువుణ్ణి చూస్తేనే ఆమెకు వొళ్లుమండేది. అయిదేండ్ల పసివాడూ, అమాయకుడూ అయిన ధ్రువుడికి సవతితల్లి అసూయగాని, తన్నూ తన తల్లినీ, తండ్రి అనాదరణగా చూచే సంగతిగానీ, తెలియనే తెలియదు. మంచివాళ్ళకు లోకమంతా మంచిగానే కనబడుతుంది కదా! అమాయ కుడైన పిల్లవాని మనస్సులో యిలాంటి కల్మషం ప్రవేశించకుండా వుంటేనే మంచిదని సునీతి కూడ తన దీనావస్థను ధ్రువుడికి తెలియ నివ్వలేదు.

నీకు హక్కు లేదు:

ఒకరోజు ఉత్తానపాదుడు నిండు సభలో ఉత్తముణ్ణి తొడపై కూర్చుండబెట్టుకొని వున్నాడు. సురుచి కూడ రాజుగారి ప్రక్కనేవుంది. ఆ సమయంలో ధ్రువుడు ఆ సభలోకి వచ్చాడు. తండ్రి తొడమీద తమ్ముడు కూర్చొని వుండటం చూచాడు. తనకూ తమ్ముని ప్రక్కవే కూర్చోవాలని అనిపించింది. గబగబా తండ్రిగారి మరోతొడపై కూర్చోవడానికి వెళ్ళాడు. తనను సమీపించి చేతులు సాచిన ధ్రువుణ్ణి ఉత్తానపాదుడు చేరదీయలేదు, సరిగదా ఏమీ పట్టనట్లు వుండిపోయాడు.

దీనికంతటికీ రాజుకు సురుచి పట్ల భయమే కారణం. సవతికొడుకు ధ్రువుడు మహారాజు వొడిలో కూర్చోడానికి రావడం చూచి సురుచి ఈర్ష్యపడింది. ధ్రువుణ్ణిచూచి సురుచి "అబ్బాయీ! అక్కడే ఆగు!" అని గట్టిగా వో కసరు కసిరింది. ధ్రువుడు నిర్ఘాంతపోయి బొమ్మలాగా అలాగే నిలబడి పోయాడు. "ధ్రువా! నీకు మహారాజుగారి వొడిలో కూర్చునే హక్కులేదు. ఆహక్కు నా కొడుకైన ఉత్తమునికి మాత్రమే వుంది. నువ్వు సునీతి కడుపున పుట్టడంతో ఆ హక్కును కోల్పోయావు. తండ్రి తొడమీద కూర్చోవాలనే కోరికవుంటే — నీవు నాకు కొడుకుగా పుట్టాలని భగవంతుణ్ణి గూర్చి తపస్సు చెయ్యి. ఆయన నీతపస్సును మెచ్చుకొని నా గర్భవాసంలో పుట్టేటట్లు చేస్తాడు. అప్పుడు నీవు సంతోషంతో రాజుగారి తొడమీద కూర్చోవచ్చు, సింహాసనంమీద కూడ కొలువుతీరవచ్చు" అని ఈసడించి ధ్రువుణ్ణి చేయిబట్టుకొని ప్రక్కకు లాగేసింది. సురుచి అలా పరుషంగా మాట్లాడుతూవుంటే ఉత్తానపాదుడు నోరు మెదపకుండా యేమీ యెరగనట్లుచూస్తూ వూరికే వున్నాడు. మాంచి యౌవనంలో వుండటం, రాజుగారు తన చేతిలో కీలుబొమ్మకావటం, సభలోవున్న మంత్రి సామంతాదులందరూ రాజుగారి అభిప్రాయానికి అనుకూలంగా నడిచేవారు అవడం, రాజుమీద, రాజ్యంమీద అధికారం వుందికదా అనే పొగరు తలకెక్కడం, తన కొడుకే మహారాజు తొడమీద కొలువుతీరి వుండటం వగైరా కారణాలన్నీ సురుచిచేత ఈ మాటలనిపించాయి.

సవతితల్లి మాటలు ధ్రువుడికి ములుకుల్లా గుచ్చుకొన్నాయి. కర్ర దెబ్బతిన్న పాములాగా పెద్దపెద్ద నిట్టూర్పుల్ని విడుస్తూ ఏడుపు ప్రారం

భించాడు. సవతి తల్లికి తనమీద, తన తల్లిమీద వున్న అసూయా ద్వేషాల్ని అర్థం చేసుకోగలిగాడు. రాజుగారి అనాదరణ ఎలాంటిదో అతనికి అర్థమయింది. పసిబిడ్డ యేడుపు చూసైనా రాజుగారి మనస్సు కరగిలేదు. తనకు జరిగిన అవమానానికి సభలోవున్న వొక్కరైనా సానుభూతి చూపకపోవడం ధ్రువుడికి మరీ ఆశ్చర్యాన్ని కలిగించింది. కొంతసేపు అక్కడే వుండి ఏడుస్తూనే తల్లిదగ్గరకు పోయాడు.

## నాకు యోగ్యత లేదా?

ఎక్కిళ్లుపట్టి ఏడుస్తూ ఎదురుగా నిలబడ్డ కొడుకును దగ్గరకు తీసుకొని సునీతి బుజ్జగిస్తూ "ఏం బాబూ! ఎందుకేడుస్తున్నావు? ఎవరైనా కొట్టారా? అయ్యో మోకాలిమీద ఆ గాయమేమిటి? ఎవరైనా పడద్రోశారా? లేక నీవే పడ్డావా? ఎప్పుడూ ఎంతో సంతోషంగా వుండే వాడివి. ఇప్పుడీ యేడుపెందుకు?'' అని పరిపరి విధాల ప్రశ్నించింది. తండ్రి, సవతితల్లి తనకు చేసిన అవమాన విషయం చెప్పడానికి ధ్రువుడికి ఆవేశం, ఏడుపూ అడ్డు వస్తున్నాయి. అక్కడ జరిగిన వ్యవహారమంతా చెలికత్తె వివరంగా సునీతికి నివేదించింది. దుఃఖంతో పెదవు లదురుతూ వుండగా ధ్రువుడు సునీతితో యిలా అన్నాడు. "ఏమమ్మా! నాన్నగారి తొడమీద కూర్చోడానికి నాకు హక్కులేదా? నేనేం పరాయివాణ్ణా? ఉత్తముడిలా నేనూ ఆయన కుమారుణ్ణే కదా? నా తమ్ముడికున్న హక్కు నాకెందుకు లేదు? ఇంతకూ మా పినతల్లి అలా అనటానికి కారణమేమిటి? ఆమెను నేను నీ కంటే కూడ గౌరవంగా చూస్తున్నానే? ఉత్తముడూ నేనూ ఎంతో అన్యోన్యంగా వుంటాం కదా? మా పిన్నమ్మకు నా మీద యింత కోపం దేనికి? ఆమెకు

నీ మీదకూడ చెప్పలేనంత కోపం వుంది. నీకు కుమారుణ్ణై పుట్టడమే నా తప్పట. నీవెప్పుడూ ఆమెను గురించి ఎంతో మంచిగా చెప్పే దానివి కదా! మరి నిన్నెందుకామె ద్వేషిస్తూ వుంది? నేను తండ్రిగారి వొడిలో కూర్చోడానికి తపస్సుచేసి, చచ్చి ఆమె కడుపున పుట్టాలట. ఇవేం మాటలు? నే నెందుకు చావాలి? చస్తేమాత్రం ఆవిడకు కొడుకునై ఎందుకు పుట్టాలి? నీవు మహారాజుకు పెద్దభార్యవు కదా? పట్టపు రాణిగా రాజుగారి ప్రక్కన కూర్చోవలసిన దానివి. నీ స్థానాన్ని మా పినతల్లి ఎలా ఆక్రమించింది? ఆమె నాకు చేసిన అవమానం చూచి దండించడానికి బదులు నాన్నగారు కిక్కురు మనకుండా మిన్నకుండడంలో అంతరార్థమేమో తెలియకుండా వుంది. ఈ తిరస్కారం నన్ను కాల్చేస్తూ వుంది —" ఇలా అంటూ ధ్రువుడు ఆపుకోలేని దుఃఖంతో బావురు మన్నాడు. అప్పుడు సునీతి గ్రుడ్లనీరు గ్రుక్కుకుంటూ కుమారుణ్ణి దగ్గరగా తీసుకొని ముద్దుపెట్టుకున్నది. కొంతసేపు ఏమీ మాటాడలేకపోయింది. ఆమె మనస్సు ఎంతో కలతపడిపోయింది.

**సునీతి ఓదార్పు:**

"అయ్యో! ఎంతో జాలిగా తనబాధను వెళ్లబెట్టిన నా బాబుకు ఏమి సమాధానం చెప్పి వూరడించగలను! నేను పడుతున్న బాధల్ని తెలిపి యీ లేతమనస్సుకు ఇంకా కష్టం కలిగించడం మంచిది కాదు కదా! దైవమా! నన్నొక చెట్టుగానో పుట్టగానో పుట్టించివుంటే నాకూ నా బిడ్డకూ ఈ బాధలుండేవి కావుకదా!" అని సునీతి ఎంతో బాధ పడింది. ఆమె మనస్సు కారుచిచ్చులో పడిన అడవిమల్లెతీగ లాగా మాడిపోయింది. అయినా కొంచెం సేపట్లోనే తన్ను తాను వోదార్చుకొని

కన్నీటిని తుడుచుకొంటూ "నాయనా! నీకు కలిగిన ఈ అవమానానికి నేనెంతో బాధపడుతున్నాను. నువు చెప్పినమాట నిజమే. నీవు నాకు కుమారుడవై పుట్టడమే తప్పు. ఆమెకే కొడుకువై పుట్టివుంటే ఎలాంటి కష్టాలూ, అవమానాలూ లేక హాయిగా వుండేవాడవు. నేనెంతో దురదృష్టవంతురాల్ని. నా కొడుకువైనందువల్ల నీవూ దురదృష్టవంతుడ వైనావు. దైవనిర్ణయం ఇలా వుంది. ఎవర్ని నిందించి ఏం ప్రయో జనం? నేను రాజుగారి పెద్దభార్యనైతేనేమి? పట్టపురాణీ నైతేనేమి? ఇక్కడ దాసీదానికున్నపాటి గౌరవమైనా నాకు లేదు. భర్త చిన్నచూపుకు గురైన భార్య వూరంతటికీ లోకువే కదా! నిన్నెలా వూరడించాలో నా కర్థం కావడం లేదు. దేవుణ్ణే నమ్ముకొని అతణ్ణి ధ్యానం చేస్తూవుంటే మనస్సులోని కలతలన్నీ నశించిపోతాయి. రోజులెప్పుడూ ఒక్కలాగే వుండవు. చీకటి తర్వాత వెన్నెల రాకతప్పదు. ఈ రోజు నిన్ను అవమానించినవారే రేపు తప్పక గౌరవిస్తారు. దానికోసం దిగులుపడద్దు. దేనికయినా సహనం కావాలి. ఎవరు మనల్ని నిందించినా, ఎలా బాధ పెట్టినా సహించాలి. మనల్ని కాదని అనుకోవాలి. కానికాలంలో కర్రే పామై కరుస్తుంది. కష్టసుఖాల్ని సమదృష్టితో చూచేవారికి మనశ్శాంతి వుంటుంది బాబూ! కాలం మనకు కలసివచ్చేదాకా వోర్పు వహించాలి. ఇప్పట్లో మనకు భగవద్ధ్యానమే శరణ్యం. పూర్వజన్మలో చేసుకొన్న కర్మల్నిబట్టి ఈ జన్మలో ఇలాంటివి జరుగుతూ వుంటాయి. కర్మ తీరగానే కష్టాలూ తీరతాయి. ఇతరులు చేసిన అపరాధాన్ని పట్టించుకోవద్దు నాయనా! ఎదుటివార్ని దుఃఖపెట్టినవారు చివరకు వారే దుఃఖాన్ని అనుభవిస్తారు. అని మెల్లగా బుజ్జగిస్తూ వోదార్చింది.

పసిమనస్సు పాషాణమైంది:

ధ్రువుడు అమ్మ చెప్పిందంతా మౌనంగా విన్నాడు. అతని మనస్సులో ఏవేవో ఆలోచనలు తరంగాల్లాగా ఎగిరెగిరి పడుతున్నాయి. ఏదో వొక నిర్ణయానికి వచ్చినట్లుగా తలూపి— "అమ్మా! నాన్నగారి తొడమీద కూర్చోవాలంటే తపస్సుచేసి దాని ఫలితంగా పినతల్లిగారికి కుమారుడై పుట్టాలిట కదా! ఇంత తపస్సు చెయ్యడం ఆమెకు కొడుకునై పుట్టడానికా? తర్వాత తండ్రిగారి అనుగ్రహం సంపాదించి ఆయన తొడపై కూర్చోడానికా? ఆయనగారి తొడమీద కూర్చోకపోతే నాకు వచ్చేనష్టమేమిటి? అదేమి దేవేంద్రుడి సింహాసనమా? తమ్ముడు కూర్చు న్నాడు కదా అని నాకూ కూర్చోవాలని అనిపించింది. అంతే అలాంటి మహాభాగ్యం కలగడానికి నేనామెకు కొడుకుగా పుట్టనక్కరలేదు. కాని, దీనివల్ల నా మనస్సులోవొక పట్టుదల యేర్పడింది. సురుచీదేవి చెప్పినట్టు భగవంతుణ్ణి గూర్చి తపస్సు చేస్తాను. లోకంలో ఎవ్వరూ పొందలేని అత్యున్నతస్థానం సంపాదించి తీర్తాను. నా తమ్ముడు ఉత్తముడికి దక్కకుండా రాజ్యాన్ని నేను కాజేస్తానని మా పినతల్లిగారి భయమైవుంటుంది. కాని అశాశ్వతమైన ఈ రాజ్యం నాకెందుకు? నాకు కావలసింది నిత్యమైన ఉన్నతస్థానం. దానికోసం ఎంత కఠిన మైన తపస్సైనా చేస్తాను. అందుకోసం అడవికి వెళ్ళాలని నిశ్చయించు కొన్నాను. నీ ఆశీస్సులు నాకుంటే చాలు. పట్టుదల వుండాలేగాని ఎంతకష్టమైన కార్యాన్నయినా సాధించవచ్చునని నీవే కదా చెప్పావు? అందుచేత నన్ను ఆశీర్వదించి పంపమ్మా!" అని తల్లి దగ్గర మారాం చేశాడు.

## తపస్సు అంతసులభమా ?

కుమారుడు అడవికి వెడతానని చెప్పేసరికి సునీతికి గుండెల్లో రాయిపడింది. ఐదేండ్ల పసిబాలుడు అరణ్యానికి పోవడమా? అక్కడ తపస్సుచేయడమా? అది ఆమెకు ఎంతమాత్రం నచ్చలేదు. "నాయనా! ఐదేండ్లు కూడ సరిగా నిండని పసిబిడ్డవు. నువ్వు తపస్సుచేయడ మేమిటి? మహామునీశ్వరులకే అది సాధ్యమవుతుంది. కాని సామాన్యు లకు సాధ్యంకాదు. నీవు రాజకుమారుడివి. మిక్కిలి సుకుమారుడవు. అడవిలో తగిన ఆహారపానీయాలు లభించవు. ఆకలి, దప్పిక వోర్చుకోవాలి. ఇక్కడ పట్టుపరుపుల మీద పడుకొని హాయిగా నిద్రించే నీవు అక్కడ చెట్లక్రింద కటికనేలమీద పడుకోవలసివస్తుంది. అక్కడ సింహాలూ - పెద్దపులులూ మొదలైన క్రూరజంతువులుంటాయి. మనుష్యుల్ని చూడగానే అవి మీదపడతాయి. రాక్షసులు, భూతప్రేత పిశాచాలూ అక్కడ మనుష్యుల్ని బ్రతకనివ్వవు. భయంకరమైన ఆ అడవుల్ని తలచుకొంటేనే వొళ్లు జలదరిస్తుంది. నువ్వు అడవికి వెళ్లితే నేనెలా జీవించి వుండగలను?"— అని సునీతి ధ్రువుణ్ణి ఎంతగానో అడవికి వెళ్లొద్దని బ్రతిమాలింది.

## తిరుగులేని పట్టుదల :

ధ్రువుడికి తల్లిమాట లెంత మాత్రం నచ్చలేదు. పైగా ఎలాగైనా సరే తపస్సు చేయడానికి అడవికి వెళ్లితీరాలనే పట్టుదల మరీ అధికమైంది. "అడవుల్లో దుష్టమృగాలుంటాయనీ, తపస్సు చేయడం నావంటి వారికి సాధ్యంకాదనీ చెపుతూ ఎందుకు భయంకలిగిస్తావమ్మా!

క్రూరమృగాలకూ, రాక్షసులు ఏగైరాలకూ భయపడేటంత పిరికివాణ్ణి కాదు నేను. అడవుల్లో ఆశ్రమాలు నిర్మించుకొని మునీశ్వరులు జీవించడం లేదా? వారి ఆశ్రమప్రాంతాల్లో క్రూరమృగాలు పెంపుడు జంతువుల్లాగా సంచరిస్తుంటాయనీ, ఆవులు నాకుతూ వుంటే అరమోడ్పు కళ్లతో పెద్ద పులులు ఆనందిస్తుంటాయనీ, పులుల పాలు త్రాగడానికి జింకలు ప్రయత్నిస్తుంటాయనీ, ఎలుకలూ పిల్లులూ ఆడుకొంటూ వుంటాయనీ ఇలా నీవే కదా చెపుతూ వుండేదానివి? సాధువుల విషయంలో క్రూరమృగాలు సైతం సాధువులుగానే వుంటాయి. తమకు హానిచేసే వారెవరో చేయనివారెవరో వాటికి బాగా తెలుసు ఇక ఆకలి దప్పికల్ని గురించా? వాటిని సహించగలిగినవాడే తపస్సుకు సిద్ధపడతాడు. సహించలేనివాడు దూరంగా వుండిపోతాడు. ఒక అసాధ్యమైనదాన్ని సాధించాలంటే ఎలాంటి శ్రమకైనా తట్టుకోవాలనీ, దృఢసంకల్పంగల వారు ఎట్టి కష్టమైన పనినైనా చేయగలరనీ నీవే అంటూవుండేదానివి. ఇప్పుడు నాకీ పిరికిమందు ఎందుకు పోస్తున్నట్టు? కష్టసుఖాలన్నీ ఆలోచించే నేను తపస్సు చేయడానికి అడవికి వెళ్ల నిశ్చయించాను. మిన్నువిరిగి మీద పడ్డా నా నిర్ణయం మారదు. నాకోరిక సఫలంకాగానే తిరిగి వస్తానమ్మా! నువ్వు మారుమాట చెప్పక నన్ను దీవించి పంపు. నన్ను గురించి నీకు ఎలాంటి బెంగా అవసరంలేదు. భగవంతుణ్ణి నమ్ముకొని వెళ్లుతున్నాను. ఆ దేవుడే నన్ను రక్షిస్తాడు.''— అని ధ్రువుడు తల్లికి నచ్చచెప్పి ఆశీర్వదించమని ప్రార్థించాడు. సునీతికి ధ్రువుడి పట్టుదల ఎలాంటిదో తెలుసు. ఇక తాను అడ్డుపెట్టినా ప్రయోజనం వుండదని గ్రహించింది. గుండె దిటవు చేసుకొని–"నాయనా! ఏకాగ్రచిత్తంతో శ్రీమన్నారాయణుని పాదపద్మాల్ని ఆశ్రయించు. ఆయన

దయవల్ల నీవు కోరిన ఉన్నతోన్నతస్థానం నీకు లభిస్తుంది. నీ దుఃఖాన్ని ఆ శ్రీహరి మాత్రమే తొలగించగలడు. నీ మనోధైర్యమే నీకు రక్ష. క్షేమంగా వెళ్లి లాభంగా తిరిగిరా తండ్రీ!"— అని ఆప్యాయంగా దీవించింది. ధ్రువుడు తల్లి దీవనలతో సంబరపడిపోయాడు. ఎవ్వరికీ తెలియకుండా రాజ భవనాన్నీ రాజధానినీ విడిచి అడవి మార్గం పట్టి వెళ్లాడు.

## నీకు సాధ్యమా?

అలా వెళ్లుతూ వుండగా త్రిలోక సంచారి అయిన నారదమహా ముని దారిలో ధ్రువుణ్ణి కలుసుకోవడం తటస్థించింది. ఆ మునీశ్వరుడు త్రిలోక సంచారి మాత్రమేకాదు. జరిగినవీ, జరుగుతున్నవీ, జరుగ బోయేవీ— అన్ని విషయాలూ ఆయనకు తెలిసినవే. ధ్రువుడు ఎందుకు ఇల్లు విడిచిపెట్టాడో, ఎక్కడికి పోతున్నాడో, అతని మనస్సులోని కోరిక యేమిటో కూడ అతనికి తెలుసు. అయినా తెలియనట్లే నటించి— "నాయనా! ముక్కువచ్చలారని పసివాడవు. ఎవ్వరితోడూ లేకుండా ఎక్కడికి వెళ్తున్నావు బాబూ! ఏం పనిమీద వెళ్తున్నావు? నిన్ను చూస్తే జాలి కలుగుతుంది. నీ సంగతేమిటో వివరంగా చెప్పు. నీకు వీలయినంత సాయం చేస్తాను." అని అన్నాడు. ఆ వచ్చిన వ్యక్తి త్రికాలజ్ఞుడగు నారదమహర్షి అని ధ్రువుడికి తెలియదు. ఎవరో సన్యాసి దయతో తన్ను ఆ విధంగా ప్రశ్నించాడని మాత్రమే అనుకొని ఏమీ దాచకుండా పూసగ్రుచ్చినట్లు విషయమంతా నివేదించాడు. అప్పుడు నారదుడు "ఓహో! నీవు ఉత్తానపాద మహారాజు కొడుకువా? ఆయన్ని నేను బాగా ఎరుగుదును. చాల మంచివాడు. ఆయన నిన్ను ఉపేక్షగా

చూచాడంటే ఆశ్చర్యంగానే వుంది. ఇంతకీ అతని తప్పులేదు. ఆడ వాళ్లకు సవతి పిల్లల మీద అభిమానం వుండడం చాల అరుదు. ఆమె మనసు నొప్పించడం ఇష్టం లేక మీ నాయన సురుచి మాటలు వింటూ ఊరుకొన్నాడనుకొంటాను. అయినా బాబూ! పసివాడివి. నీకు మానావమానాలేమిటి? నీ సవతితల్లి మాటలు పట్టించుకోవడం అనవసరం. నీకు తెలుసునో లేదో నా పేరు నారదుడు. మూడు లోకాల్లోనూ తిరుగుతూ అందరకూ నాచేతనైనంత సాయం చేస్తూ వుంటాను. అయితేనేం! నన్ను కలహప్రియుడనీ, తగవులమారిననీ నిందిస్తూ వుంటారు. వాళ్ల వాళ్ల కర్మల్నిబట్టి వాళ్లు పోట్లాడుకొంటె దానికి నేనేం చెయ్యగలను? నన్ను అందరూ నిందిస్తున్నారని బాధపడి నేను క్రుంగిపోనూ లేదు, ఉపకారం చెయ్యడం మానసూలేదు. ఇంతటి మహర్షి నేనే పొగడ్తల్నీ తెగడ్తల్నీ లెక్క చెయ్యనప్పుడు పసివాడివైన నీకు ఈ పట్టుదల యేమిటి? దుఃఖమనేది అందరకూ వారి వారి కర్మననుసరించి కలుగుతూ వుంటుంది. ఏది వచ్చినా అంతా దైవేచ్ఛ అనుకొని తృప్తి పడడం బుద్ధిమంతుల లక్షణం. మీ పినతల్లి మాటలకు బాధపడి భగవదనుగ్రహం సంపాదించాలని చూస్తున్నావు. కాని తపస్సు చేయడం, భగవంతుని దయను సంపాదించడం నీవనుకొన్నంత సులభం కాదు. మహామహులే సర్వసంగపరిత్యాగంచేసి కఠోరమైన తపస్సు చేసికూడ భగవంతుణ్ణి దర్శించలేకున్నారు. అరణ్యవాసమంటే అమ్మ దగ్గర అంతఃపురంలో వుండడమనుకొన్నావా? నా మాటవిని ఇంటికిపో. నీవు కోరుతున్న ఉన్నత స్థానాన్ని పొందటానికి తగిన సమయం వస్తుంది. అప్పుడు ప్రయత్నించు. నీవు ఇల్లు విడిచి వచ్చినందుకు ఇప్పటికే మీ తండ్రి పశ్చాత్తాపపడుతుంటాడు. మీ పినతల్లి కూడ

అయ్యో! పసిబిడ్డను పొరపాటుగా నిందించానే! పాపం! ఎక్కడ ఎలాంటి యిబ్బందులు పడుతున్నాడో! " అని బాధపడుతూ వుంటుంది. ఇక మీ అమ్మసంగతి చెప్పనే అక్కరలేదు కదా!" — అని ధ్రువుణ్ణి ఎంతగానో నిరుత్సాహ పరచాడు.

## దారి చూపండి:

ధ్రువుడు మహామునికి నమస్కరించి నారదమహర్షీ! మీ దర్శనం వల్ల ధన్యుణ్ణయ్యాను. తపస్సు చేసే పద్ధతి ఎలా తెలుసు కోవడమా? అని ఆలోచిస్తూవుండగా అనుకోకుండా నా భాగ్యవశంవల్ల మీ దర్శనం లభించింది. మీ సలహా మంచిది కాదనను. కాని నా సవతితల్లి మాటలు ములుకుల్లాగా గ్రుచ్చుకొని నా గుండె గాయపడింది. మునీశ్వరా! నీవు బ్రహ్మదేవుని కుమారుడవు. ముల్లోకాలూ తిరిగే వాడవు. నా పూర్వులుగాని, ఇంతవరకు మరెవ్వరుగాని పొందని ఉన్నతోన్నతమైన పదవిని పొందాలనే నా కోరిక. నా నిర్ణయం మారడం అసంభవం. మా అమ్మతో చెప్పి ఆమె ఆశీర్వాదం పొందే బయలు దేరాను. మీరు నన్ననుగ్రహించండి. నేనెలా తపస్సు చేయాలో, ఎక్కడ వుండాలో తెలియజేస్తే మీ మాటప్రకారం నడచుకొంటాను " అని ప్రార్థించాడు.

## ప్రయత్నించు - విజయాన్నిసాధించు:

ధ్రువుడి పట్టుదల నారదునికెంతో ఆనందాన్ని కలిగించింది. సంతోషంతో ధ్రువుడి తలమీద చేతితో నిమురుతూ — "బాబూ! నీ పట్టుదలకు నేను సంతోషిస్తున్నాను. తప్పక నీవు భగవదనుగ్రహం

పొందగలవని నా విశ్వాసం. యమునా నదీతీరంలో మధువనమనే పవిత్రవనమొకటుంది. అక్కడికి వెళ్లి మూడు పూటలూ స్నానంచేసి, నిత్యకర్మలు ముగించుకొని పద్మాసనంలో స్థిరంగా కూర్చో. ప్రాణాయామంచేసి ఇంద్రియాల్ని అదుపులో పెట్టుకొని "ఓం! నమో భగవతే వాసుదేవాయ—" అనే పరమరహస్యమైన ఈ మంత్రాన్ని జపించు. త్రికరణశుద్ధిగా భక్తిపూర్వకంగా భగవంతుణ్ణి పూజిస్తే అతడు ప్రత్యక్షమై తప్పక నిన్ననుగ్రహిస్తాడు. మరొకసంగతి-ఎవ్వరు తపస్సు చేస్తున్నా దాన్ని పాడుచేయడానికి దేవతలరాజు దేవేంద్రుడు అన్ని విధాలా ప్రయత్నిస్తాడు తపస్సు పూర్తయి భగవంతుడు ప్రత్యక్షమైతే తన ఇంద్రపదవిని కోరుతారేమో అని అతని భయం. తపస్సును విఘ్నం చేయడానికి మాయామృగాల్ని సృష్టించి నీ మీదికి పంపవచ్చు దేవతలు మారువేషాల్లో వచ్చి అనేక విధాల దుర్బోధలు చెయ్యవచ్చు. ఆ బోధలకు లొంగవద్దు. మృగాలకు భయపడవద్దు. ఏ మాయలకూ లొంగకుండా దీరుడివై పట్టుదలతో తపస్సు చెయ్యి. నీకు శుభంకలుగుతుంది" అని చెప్పి తపోవిధానాన్ని బోధించి, వాసుదేవ మంత్రోపదేశం చేసి వెళ్లిపోయాడు ధ్రువుడు మిక్కిలి సంతోషంతో మధువనానికి దారితీశాడు.

ఉత్తానపాదుని పరితాపం:

అక్కడ సునీతిమాటలు విన్నవెంటనే ధ్రువుడు తటాలున వెళ్లడం చూచి ఉత్తానపాదుడు తన తప్పు తెలుసుకొన్నాడు. అతని మనస్సు చాలా కలతపడింది. వెంటనే అతడూ తన భవనానికి వెళ్లిపోయాడు. ఆ రోజు ఆయన ఎవ్వరితోనూ మాట్లాడకుండా ఏకాంతం

గానే గడిపాడు. ఆ రాత్రి నిద్రపట్టలేదు. మరునాడు తెల్లవారే సరికి సునీతీదేవి భవనంనుంచి వార్తవచ్చింది. ధ్రువుడు నిన్నటినుంచీ ఇంటికిరాలేదని, ఆ మాట వినేసరికి రాజుకు దిగులుపట్టుకుంది. ధ్రువుడు ఏమైనా అఘాయిత్యం చేసుకోలేదు గదా! అనే అనుమానం తట్టింది. అతణ్ణి వెతకడానికి నాలుగు దిక్కులకూ సేవకుల్ని పంపాడు. వాళ్లు తిరిగివచ్చి 'ఎక్కడా ధ్రువుడు కనపడలేద'ని చెప్పారు. రాజు గారికి మనసు మనసులో లేదు.

## నువ్వేమీ దిగులుపడద్దు:

ఇంతలో నారదమహాముని ఆయన వద్దకు వచ్చాడు. ఉత్తాన పాదుడు అతనికి అర్ఘ్యపాద్యాదులిచ్చి సత్కరించి తగినపీఠం మీద కూర్చోబెట్టాడు. రాజు విచారంతో వుండడంచూచి తనకు సంగతంతా తెలిసినా ఏమీ తెలియనట్లే నటిస్తూ "రాజా! ఎందుకలా విచారంగా వున్నావు?" అని అడిగాడు. ముల్లోక సంచారి కాబట్టి నారదునికి ధ్రువుని జాడ తెలిసివుండవచ్చునవే ఆశతో రాజు జరిగినదంతా వివ రంగా చెప్పాడు. నారదుడు కొంచెం ఆలోచించినట్లు నటించి 'రాజా! విచారించవద్దు. మీ అబ్బాయి క్షేమంగానే వున్నాడు. ఈ ప్రాంతాల్లో లేడు. ఎక్కడో అడవిలో తపస్సు చేసుకొంటున్నాడు. నువ్వేమీ దిగులు పెట్టుకోవద్దు. ధ్రువుడి పట్టుదల నాకు తెలుసు. అనుకొన్నది సాధించిగాని తిరిగిరాడు-" అని చెప్పి రాజు విచారంపోగొట్టి వెళ్లాడు.

## కారడవిలో కఠినతపస్సు:

మధువనానికి పోయిన ధ్రువుడు నారదుని ఉపదేశానుసారం

తపోనిష్ఠలో వుండి ద్వాదశాక్షరీ మహామంత్రాన్ని తదేక నిష్ఠతో జపిస్తూ, ఒక చెట్టునీడన నివాసం యేర్పాటు చేసుకొని రోజులు గడుపుతూ వున్నాడు. అతడు ఉదయాన్నే లేచి స్నానాదులు ముగించుకొని తపస్సు ప్రారంభించే వాడు. చెట్లనుండి రాలిన పళ్లనూ, కందమూలాల్నీ భక్షించి ఆకలి తీర్చుకొనేవాడు. మూడుదినాలకొకమారు రేగుపండ్లు, వెలగపండు మాత్రంతింటూ ఒక నెలగడిపాడు. ఆరుదినాలకొకసారి గడ్డి, ఆకులు మాత్రమే ఆహారంగా పుచ్చుకొంటూ శ్రీమహావిష్ణువును ధ్యానించాడు, ఐదవనెలలో ఉచ్ఛ్వాస నిశ్వాసాల్నికూడ బంధించి ఒంటికాలిమీద నిలబడి నిశ్చలమైన మనస్సుతో శ్రీహరిని ధ్యానించడం ప్రారంభించాడు. అయిదు సంవత్సరాల పసిబిడ్డ అకుంఠితమైన పట్టుదలతో భగవంతుణ్ణి ప్రార్థిస్తూవుండగా అతని తపోగ్నికి ముల్లోకాలూ కంపించిపోయాయి. ధ్రువుని తపోనిష్ఠకు దేవేంద్రుడు భయపడి నారదుడు చెప్పినట్లే అతని తపస్సును భంగంచేయడానికి దేవతల్ని పంపడమేగాక మాయామృగాల్నికూడ కల్పించి పంపాడు.

ఇంద్రుడికి భంగపాటు :

ధ్రువుడు ప్రతిరోజూ సింహాలు, పెద్దపులులు మొదలైన క్రూర మృగాల్నిచూస్తూవే వున్నాడు. అవేవీ అతని జోలికి పోలేదు. ఇంద్రుడు పంపిన మాయామృగాలు మాత్రం పెద్దగా అరుస్తూ మీదికి వచ్చేవి. వాటినిచూచి ధ్రువుడు సంగతి గ్రహించి ధైర్యంగా వుండే వాడు. అవి మాయమైపోయేవి. ఇంద్రుడు పంపిన దేవతలు కొందరు పిశాచాలుగాను, భూతాలుగాను వచ్చి ధ్రువుణ్ణి బెదిరించేవారు. అయినా ఆ బాలుడు జంకుకొంకులు లేకుండా ధైర్యంగా దైవధ్యానంలో

మునిగివుండేవాడు. ఇంద్రుడు ఆలోచించి భయపెట్టడంవల్ల ప్రయోజనం లేదని గ్రహించి మంచిగా అతణ్ణిలొంగ తీసుకోవాలని నిశ్చయించాడు. ఒకనాడు సునీతివేషం ధరించి వొక దేవత ధ్రువుడి దగ్గరకు ఏడుస్తూ వచ్చి - "నాయనా! నీవు ఇల్లు విడిచివచ్చిన దగ్గర్నుంచీ నాకు నిద్రా హారాదుల్లేవు. ఏడ్చి ఏడ్చి నా కన్నులు వాచిపోయాయి. నువ్వు తపస్సు మానుకొని ఇంటికి రాకపోతే నేను బ్రతకలేను. నీకు అమ్మ కావాలంటే వెంటనే యింటికిరా'' అని బతిమలాడింది. ఇదంతా దేవతల పన్నాగమని ధ్రువుడికి తెలుసు. ఆమెవైపు కన్నెత్తికూడా చూడలేదు. మరికొద్దిరోజులకు సురుచిరూపంలో వచ్చిన దేవత "కుమారా! ధ్రువా! ఏదో పొరపాటున ఉద్రేకంతో నిన్ను అనరాని మాటలన్నాను. నా తప్పు క్షమించు. నావల్లనీవు ఇల్లు విడిచి అడవిలో ఇలా కఠోరమైన తపస్సు చేయడం నాకెంతోబాధగావుంది. లోకమంతా నన్ను ఆడి పోసుకొంటూవుంది. నీ తమ్ముడు ఉత్తముడు నీ కోసం బెంగపెట్టు కొని అన్నమూ నీళ్లు కూడా మానివేశాడు. మీ నాన్నగారు పశ్చా త్తాపంతో నిద్రాహారాలు వదిలేసి మంచంపట్టారు. నాకోసం ఇంటికిరా బాబూ!'' అని ఎంతగానో ప్రాధేయపడింది. కాని ధ్రువుడు ఏమాత్రం చలించలేదు. ఇలా దేవేంద్రుడు చేసిన ప్రయత్నాలన్నీ విఫలమై పోయాయి.

స్వామి ప్రత్యక్షమయ్యాడు:

ఈ విధంగా ధ్రువుడు అచంచలమైన మనస్సుతో శ్రీమన్నా రాయణుని ధ్యానిస్తూ తపస్సు కొనసాగించాడు. ఎండకాలంలో తీవ్ర మైన యెండలకు, వేడిగాలులకు బాధపడలేదు. వర్షకాలంలో సంతత

ధారగా పిడుగులతో వర్షాలు కురుస్తున్నా ఉన్నచోటునుండి కదల్లేదు. విపరీతంగా మంచు కురుస్తుంటగా ఎముకలు కొరికే చలిలో కూడ చలించలేదు. ఇలా తపస్సు చేయగా చేయగా చతుర్భుజుడు, శంఖచక్రగదాఖడ్గధారి, పీతాంబరుడు ఐన శ్రీమహావిష్ణువు అనుగ్రహించి గరుడవాహనారూఢుడై ధ్రువుని ముందు ప్రత్యక్షమైనాడు. ధ్రువుని ఆనందానికి హద్దులేకపోయింది. ఉబ్బితబ్బిబ్బైపోయి సాష్టాంగ నమస్కారం చేశాడు. భగవంతుని దివ్యమంగళ విగ్రహాన్ని త్రాగుతున్నట్లు, ముద్దుపెట్టుకొంటున్నట్లు, కౌగలించుకొంటున్నట్లు బావించాడు. లేచి నిలబడి చేతులుజోడించి స్వామిముందు నిలబడ్డాడు. స్వామిని స్తుతించాలని ధ్రువుడి మనస్సు ఉరకలు వేసింది. కాని అయిదేండ్ల పసివాడు. ఎలాస్తుతించాలో తెలియలేదు. విష్ణుదేవుడు కరుణించి తన పాంచజన్యశంఖాన్ని అతని చెక్కిళ్లకు తాకించాడు. ధ్రువుడిలో దైవవాణి పెల్లుబికింది. "ప్రభూ! సమస్త శక్తులకు ఆధారుడవైన నీవు నా అవయవాలకు ప్రాణంపోసి చైతన్యాన్ని కలిగించిన నీకు నమస్కారము. ఈ ప్రపంచమంతా నీవల్లనే పుట్టి నీలోనే లీనమైపోతూవుంది. సృష్టి స్థితిలయాలు లేని నీవే సమస్త బ్రహ్మాండానికి మూలకారకుడవు. నాట్యాచార్యునిలాగా అనేక రూపాలతో, పలువిధాలైన పేర్లతో నీవు ప్రకాశిస్తున్నావు. ధనికుడనీ, దరిద్రుడనీ భేదంలేకుండా భక్తుడైన వారికి సహాయపడేవాడవు. నీకు ఆదిమధ్యాంతాలులేవు-" అని ఈ విధంగా పరి పరి విధాల ప్రస్తుతించాడు.

**ధ్రువపదం నీకిస్తాను:**

అతని శ్రద్ధా భక్తులకు, పట్టుదలకు భగవంతుడు మిక్కిలి

సంతోషించి "వత్సా! నీ తపస్సు నాకు ఎంతో తృప్తిని కలిగించింది. నీ మనస్సులోని సంకల్పం ఏమిటో నాకు తెలుసు. అందువల్ల 'నీకు ఏమివరం కావాలి?' అని వేనడగను. నీవు కోరిన సర్వోన్నతమైన స్థానం చాల దుర్లభమైంది. అయినప్పటికీ నీకు దాన్ని అనుగ్రహిస్తాను. ఇంతవరకూ ఎవ్వరికీ లభించని ధ్రువపదం నీకిస్తాను. దాని చుట్టూ గ్రహాలు, నక్షత్రాలు సదా తిరుగుతుంటాయి. ప్రళయకాలంలో ఇతర లోకాలన్నీ నశించిపోయినా ధ్రువలోకం మాత్రం స్థిరంగా వుంటుంది. నక్షత్రాలతోపాటు యముడు, కశ్యపుడు, ఇంద్రుడు, సప్తర్షులు దానికి ప్రదక్షిణం చేస్తారు. కాని ఆ స్థానం నీకు లభించడానికి తగిన సమయం రావాలి. నీవు మీ తండ్రి దగ్గఱకు వెళ్లు. మీ తండ్రి అనంతరం రాజ్యసుఖాల్ని అనుభవించు. వార్ధక్యం వచ్చాక కుమారుడికి రాజ్యం అప్పగించి నన్ను ప్రార్థించు. సప్తర్షిమండలం మీదవున్న నా దివ్య స్థానాన్ని చేరుకుంటావు. అని చెప్పి భగవంతుడు మాయమైపోయాడు.

**అందఱు ఆనందంగా కలిశారు:**

శ్రీ మహావిష్ణువు ధ్రువుడికి ప్రత్యక్షమైన సంగతి మధువనంలో వున్నవారందరికీ తెలిసిపోయింది. వారంతా అతణ్ణి ఎన్నోవిధాల అభినందించారు. ధ్రువుడి ఆచూకీ తెలుసుకోవడానికి దేశమంతా తిరుగుతూ ఆప్రాంతానికి వచ్చిన ఉత్తానపాదుని చారులకు కూడ ఈ సమాచారం తెలిసింది. వారు వెంటనే తమ రాజుగారికీవార్త చేరవేశారు. ధ్రువుడు తిరిగి వస్తున్నాడనే వార్త ఆరిపోతున్న దీపానికి నూనెలాగా ఉత్తానపాదుని విషయంలో పనిచేసింది. ధ్రువుడువెళ్లిన నాటినుండి దుఃఖసముద్రంలో మునిగివున్న రాజు మొదట చారుల మాటను

నమ్మలేదు. ఎప్పుడో ఇల్లు విడిచిపెట్టి పోయిన పసిబాలుడు ఇంత కాలం జీవించివుంటాడని ఆయన అనుకోలేదు. కాని ఇంతలో అతనికి నారదమహర్షి చెప్పిన మాట జ్ఞప్తికి వచ్చింది. మహాఋషులమాట ఎన్నడూ అబద్ధంకాదు కదా! అందువల్ల చారులమాట నిజమే అని నమ్మకం కలిగింది. వెంటనే లేచి మంచిగుఱ్ఱాలు కట్టిన బంగారు రథం ఎక్కి ధ్రువుడికి ఎదురుగా బయలుదేరాడు. మంత్రులు సామంతులు, పురోహితులు మొదలైన వారంతా రాజు వెంటనడచారు. సునీతి సురుచి ఉత్తముడూ కూడ రాజు ననుసరించారు.

ఎదురుగా వస్తున్న ధ్రువుణ్ణి మొదట చూచింది ఉత్తానపాదుడే. "నాయనా! ధ్రువా! అంటూ కేకవేసి రథంనుంచి దూకి రెండుచేతులూ చాచుకొని ధ్రువుడివైపు పరుగెత్తాడు. తండ్రిని చూచిన ధ్రువుడు ఉత్సాహంగా ఉత్తానపాదునివైపు ఉరికాడు. కొడుకును కౌగలించు కొన్నరాజుకు ఆనందబాష్పాలు జలజలారాలాయి. ధ్రువుడి తలను ముద్దుపెట్టుకుంటూ మాటిమాటికీ చెక్కిళ్లు నిమురుతూ రాజు ఏమీ మాట్లాడలేక పోయాడు. ఆమునలిప్రాణం సంతోషంతో ఎంత ఉక్కిరి బిక్కిరి అయ్యిందో చెప్పడం కష్టం. ధ్రువుడు సునీతికి, సురుచికీ నమస్కరించాడు. ఆ తల్లులిద్దరూ ఆనందపారవశ్యంతో అతణ్ణి ముద్దు బెట్టుకొన్నారు. ధ్రువుడు ఉత్తముణ్ణి కౌగలించుకొన్నాడు. ఆ అన్న దమ్ములిద్దరూ ఎంతో సంబరపడిపోయారు. అక్కడ చేరిన పురోహిత మంత్రి సామంతాదులందరూ అమితానందంతో ధ్రువుణ్ణి కొనియాడారు. ధ్రువుడు, రాజుమొదలైన వారంతా రాజభవనంవైపు సాగిపోయారు.

అనంతరం:

ధ్రువుడికి యుక్తవయస్సు వచ్చేటప్పటికి ఉత్తానపాదునికి ముసలితనం వచ్చింది. రాజ్యం మీద విరక్తి కలిగింది. అతడు ధ్రువుడికి రాజ్యాన్నప్పగించి వనవాసానికి వెళ్లాడు. ధ్రువుడు ప్రజారంజకంగా రాజ్యంచేస్తూ శింశుమార ప్రజాపతి కూతురు 'భ్రమి' ని వివాహం చేసుకొన్నాడు. ఆమె వల్ల కల్పుడు, వత్సరుడు అనే ఇద్దరు కొడుకులు కలిగారు. ధ్రువుడు వాయుదేవుని కుమార్తె 'ఇళ' అనే ఆమెను సైతం పెండ్లాడి ఆమెవలన "ఉత్కలుడు" అనే కొడుకును, ఒకకుమార్తెను కన్నాడు.

ఉత్తముడు యక్షుల పాలయ్యాడు :

ఇలావుండగా ఒకసారి ఉత్తముడు అడవికి వేటకు వెళ్లాడు. ఆ అడవి తమరాజధానికి చాలాదూరంలో హిమాలయప్రాంతాన వుంది. అది యక్షులుండే తావు. ఉత్తముడికి అక్కడున్న యక్షులతో దెబ్బలాట జరిగింది. ఆ కలహంలో అతడు చచ్చిపోయాడు. తమ్ముని మరణవార్త ధ్రువుడికి ఎంతో దుఃఖాన్ని కలిగించింది. ఇలా ముందుముందు జరుగుతుందని ధ్రువుడికి, ఆనాడే భగవంతుడు చెప్పాడు. విధిని తప్పించడం ఎవ్వరికీ సాధ్యం కాదు కదా!

సురుచి దావాగ్నికాహుతైంది :

కుమారుని మరణవార్త విని సురుచి నిలువునా కూలిపోయింది. ఉత్తముడు వివాహం చేసుకోలేదు. అందువల్ల అతని సంతానాన్ని చూచుకొని అయినా కొంత మనశ్శాంతి పొందే అవకాశంకూడా ఆమెకు

లేకపోయింది. పుత్రవియోగం సహింపలేక సురుచి మనశ్శాంతికోసం అడవుల్లో ఏకాంతంగా గడపాలని నిశ్చయించుకొని వెళ్లింది. దురదృష్టంవల్ల అక్కడ దావాగ్నిలో చిక్కుకొని మరణించింది.

**యక్షజాతికి మారణహోమం:**

తమ్ముడు, పినతల్లి ఈవిధంగా బలవన్మరణం పొందడంతో ధ్రువుడికి బాధతోపాటు యక్షులమీదకూడ తీవ్రమైన ఆగ్రహం కలిగింది. తనసోదరుణ్ణి చంపిన యక్షుల అంతం చూడాలనే పట్టుదల హెచ్చింది. పట్టుదలకు మారుపేరైన ధ్రువుడు ఒంటరిగా రథాన్నెక్కి అస్త్రశస్త్రాలు ధరించి హిమవత్ప్రాంతంలోని యక్షులపైకి యుద్ధానికి వెళ్లాడు.

తమమీదికి యుద్ధానికి వచ్చిన ధ్రువుడితో యక్షులు తలపడ్డారు. ధ్రువుడు ప్రయోగించే ఆయుధాల దెబ్బలకు యక్షులు చెఱుకుగడల్లాగా తెగిపడ్డారు. ధ్రువుణ్ణి ఎదిరించిన వాడెవడూ తిరిగి ప్రాణాలతో తమవారిని కలుసుకోవడం లేనేలేదు. ఇలాగే కొంతకాలం యుద్ధం జరిగితే యక్షులు పూర్తిగా నశించిపోతారని అందరకూ భయం ఏర్పడింది. యక్షులు యుద్ధంలో ఎన్నోమాయలు ప్రయోగించారు. అవన్నీ ధ్రువుడి ముందు గాలికి దూదిపింజల్లా ఎగిరిపోయాయి.

**కోపం వద్దు:**

ఈ యక్షుల చావును ధ్రువుడి తాత స్వాయంభువ మనువు చూచాడు. వారిపై అతనికి జాలి కలిగింది. ధ్రువుడి దగ్గరకు "వచ్చి నాయనా! ఇంతకోపం పనికిరాదు. నీ తమ్ముణ్ణి ఎవడో వొక యక్షుడు చంపాడని యక్షవంశాన్నే నాశనం చేస్తున్నావు. పెద్దల విష

యంలో సహనం, తక్కువ వారిమీద దయ, సమానులపట్ల స్నేహం, ప్రాణులందరియెడా సమభావం కలవానికి భగవంతుడు ప్రసన్నుడవుతాడు. కర్మబంధాలకు కట్టుబడిన జీవుల ఆయుస్సును పెంచడం త్రుంచడం భగవంతుడే చేస్తుంటాడు. పసితనంలోనే భగవంతుణ్ణి ప్రత్యక్షం చేసుకొన్ననీకు శత్రు మిత్ర భేదం తగదు. ఔషధంతో రోగం శాంతించినట్లు నామాటలతో నీ క్రోధాన్ని తగ్గించు. యక్షుల్ని నీవు చంపుతున్నావు. వారు కుబేరునికి అనుచరులు. అతడు పరమేశ్వరునకు స్నేహితుడు. నీవు చేస్తున్న ఈపనివల్ల కుబేరుడు, ఈశ్వరుడూకూడ నీమీద కోపపడతారు. అది మంచిదికాదు. స్తోత్రాదులచేత కుబేరుణ్ణి ప్రసన్నుణ్ణి చేసుకో" అని ఉపదేశించాడు. మనువు మాటప్రకారం ధ్రువుడు యుద్ధం మానివేశాడు. అదేసమయంలో కుబేరుడుకూడ అక్కడికి వచ్చాడు. ధ్రువుడతనికి వినయంతో శిరస్సు వంచి నమస్కరించాడు.

## ఇంద్రుడి హితోపదేశం :

కుబేరుడు ధ్రువుణ్ణిచూచి "నాయనా! నీవు చాల బుద్ధిమంతుడవు. మీ తాతగారి మాటను గౌరవించి యుద్ధం మానివేశావు. నాకు చాల సంతోషమయింది. నీ తమ్ముణ్ణి యక్షులు చంపారని నువ్వు వారిమీద కోపించవద్దు. తలవ్రాతను ఎవ్వరూ తప్పించలేరు. అతడికి అంత్యకాలం వచ్చినందువల్లే అలా జరిగింది. దేనికైనా మనం నిమిత్తమాత్రులమే. నశించిపోయే శరీరాన్నే శాశ్వతమైన ఆత్మ అని భావించడంవల్ల 'నీవు - నేను' అనే భేదభావం మానవులకు కలుగుతూ

వుంది. నీవు ఈభేద బుద్ధిని విడిచి సర్వప్రాణుల్ని సమదృష్టితోచూడు భగవంతుడు నీకు మేలుచేయుగాక ”-అని ప్రబోధించాడు.

తర్వాత ధ్రువుడు, ప్రశాంతమైన మనస్సుతో తననగరానికి వచ్చేశాడు. ప్రజల్ని కన్నబిడ్డల్లాగా చాలకాలం పరిపాలించాడు. చివరకు కుమారుడైన ‘ ఉత్కలుడికి ’ రాజ్యాభిషేకంచేసి వైరాగ్యంతో బదరికాశ్రమానికి వెళ్ళాడు. అక్కడ ప్రవహిస్తూవున్న విశాలానదిలో స్నానంచేసి స్థిరచిత్తంతో భగవంతుణ్ణి ధ్యానించాడు.

ఉన్నత స్థానానికి :

ధ్రువుడి ధ్యాననిష్ఠకు, భక్తికీ సంతోషించి శ్రీహరి ఒక విమానాన్ని పంపించాడు. అది ఆకాశంలో పున్నమి చందమామ లాగా ధ్రువుడికి కన్పడింది. ఆవిమానంనుంచి ఇద్దరు విష్ణుదూతలు నందుడు సునందుడు అనేవారు దిగివచ్చి ధ్రువుడికి నమస్కారంచేసి శ్రీమన్నారాయణుని ఆజ్ఞానుసారం విమానం ఎక్కవలసిందని ప్రార్థించారు. ధ్రువుడు పరమానందంతో బదరికాశ్రమంలోని మునులందరికీ నమస్కరించాడు. వారి ఆశీర్వాదాలందుకొని విమానం ఎక్కాడు

అమ్మ ఎక్కడ ?

విమానం బయలుదేరే ముందు ధ్రువుడికి తల్లి గుర్తుకు వచ్చింది. ఆమెను వదలి నేనొక్కణ్ణే వెళ్లడమా! అనుకున్నాడు. విష్ణుదూతలు ధ్రువుడి మనసులోని విషయాన్ని గ్రహించారు. ‘అయ్యా! సునీతా దేవినిగూర్చి నీవేమీ విచారించవద్దు. ఆమె నీకంటేముందే మరో విమానంఎక్కి స్వర్గానికి వెళ్లుతూవుంది చూడు ’ అని ముందుపోతున్న

విమానాన్ని చూపారు. అందులోవున్న తల్లినిచూచి ధ్రువుడెంతో సంతోషించాడు.

ధ్రువస్థానం:

ధ్రువుడెక్కిన విమానం గగనమార్గంలో అతివేగంగా వెళ్తూ సప్తర్షిమండలాన్నికూడా దాటి అత్యున్నతమైన స్థానాన్ని చేరింది. విష్ణుదేవుని దయవల్ల ధ్రువుడొక దేదీప్యమానమైన నక్షత్రంగా మారిపోయి, అక్కడ స్థిరంగా నిలిచిపోయాడు. ఆ ప్రాంతం అతని పేరుతో ధ్రువమండలంగా ప్రసిద్ధి పొందింది ఆ ధ్రువనక్షత్రాన్ననుసరించే గ్రహాలన్నీ తిరుగుతున్నాయి. భూమిచలనం దాన్ని అనుసరించేవుంది.

పట్టుదల ప్రయత్నంవుంటే ఎంతకష్టమయిన కార్యాన్నైనా సాధించవచ్చుననడానికి ధ్రువుడికథ చక్కటి ఉదాహరణం. ధ్రువుడు మనకాదర్శమైతే విష్ణుదేవుడు ఆయురారోగ్యభాగ్యాలిచ్చి రక్షిస్తాడనడంలో సందేహంలేదు.